

# రంగురంగుల రత్నదీపాలు

తీయ బాలసాహిత్యం
దిహేనో పోటీలో
లుగు ప్రాంతీయ భాషల్లో
గ వెలుగుగా ఎన్నికై
య బహుమానమందిన
న.



* * *

మిరియాల రామకృష్ణ



# రంగు రంగుల రత్న దీపాలు



భారతీయ బాల సాహిత్యం పదిహేనో పోటీలో
పధ్నాలుగు సాటి ప్రాంతీయ భాషల్లో
తెలుగు వెలుగుగా ఎన్నికై
రు. 1000/—ల జాతీయ బహుమానానికి
అర్హణీయమైన అపురూప రచన

మిరియాల రామకృష్ణ

రంగురంగుల రత్నదీపాలు

అంకితం

స్నిగ్ధ మనస్కులు

శ్రీ ఐ. వి. చలపతిరావుగారికి

రచన

మిరియాల రామకృష్ణ

ఆముఖరచన

డా. సి. నారాయణరెడ్డి

చిత్రరచన

ఆనంద్


ముద్రణ

[illegible]

ప్రచురణ

యం. రామకృష్ణ, హైద్రాబాద్.

ప్రతులకు

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్,
రాష్ట్రపతి రోడ్డు, సికింద్రాబాద్.

వెల : 1-50

# ఇది ఎవరికోసం

త్తొమ్మిదేళ్ళనుండి పధ్నాలుగేళ్ళ ప్రాయపు చందమామలకు
చిన్నారిపొన్నారులకు స్వప్నాల సార్వభౌములకు
అమ్మాయీ అబ్బాయీ ఒకమాట చెబుతా చూడండీ
తొమ్మిదిని మూడుపెట్టి గుణిస్తే 27 కదాండీ
ఇది కవితా 'నవరత్నాల' మూడుపేటల నక్షత్రహారం మీకోసం
కావలసింది వీటిని చదివాకా మీ మధురాధర హాసం
మీరే రేపు భారతజాతిరత్నాలు రంగురంగుల దీపాలు
ఏరీ మీరు కాక తొలగించేవారు మన చీకట్లపాపాలు
అందుకే మీరూ రంగురంగుల రత్నదీపాలే!
అందుకోండి ఈ 27 కవితలూ రంగుల రత్నదీపాలే!

* * *

---

మనస్సు
తో
నమస్సు

దివ్వెల వెన్నెలతో పువ్వుల బాసలో
నన్ను నవ్వించిన
డా. సి. నారాయణరెడ్డిగారికి

*

అందుకుంటానని హస్తంచాచి నన్ను
ఆనందపరిచిన
శ్రీ ఐ. వి. చలపతిరావుగారికి

*

అందిస్తానందరికీ అని నా కందుదలకు
చెందొవలు కట్టిన
శ్రీ ఎం. ఎన్. రావుగారికి

*

అచ్చువేసుకొంటానంటే పుచ్చుకోమని
సొమ్ము లిచ్చిన
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారికి

*

---

# చదవండి



* * *

# దివ్వెల వెన్నెల

డాక్టర్. సి. నారాయణరెడ్డి

★

బాల వాఙ్మయం ఎప్పుడు పుట్టింది?
అలనాటి మనిషిపుట్టిన తొలినాళ్లలోనే.
'అనగనగా ఒకరాజు' అని
ఆదికాలపు ముసలవ్వ
కథలకషలి చిలికించిన తొలిపొద్దుల్లోనే.
'చందమామ రావే జాబిల్లి రావే' అంటూ
పసిబిడ్డకు గోరుముద్దలు తినిపిస్తూ
పరవశించి ఆలపించే పసిడితల్లి పలుకుల్లోనే.
'చెమ్మచెక్కా చేరడేసి మొగ్గా' అంటూ
గంతులతో కేరింతలతో పాడుకునే
చిన్నారి బాలల పొన్నారి పాటల్లోనే.

బాలవాఙ్మయం జానపదవాఙ్మయంలో
ఒక పిల్లకాల్వగా ఉండేది
ఈ శతాబ్ది తెల్లవారేదాకా.
క్రమంగా మహామహా కవులకే మనసు పుట్టింది
పిల్లలకు పనికొచ్చే పాటలూ కథలూ రాయాలని.
గురజాడ అప్పారావుగారు రాశారు
ఆ రోజుల్లోనే అంటే 1915 లోపుగా—
'అరిటికాయబజ్జి, మినప్పప్పు బొజ్జి' అనీ,
'ఏనుగెక్కి ఏ వూరెళదాం
ఏనుగెక్కి ఏలూరెళదాం' అనీ.

రామరామ
వెంకటపార్వతీశ్వరుల వంటి విద్వత్కవులూ
గిడుగు సీతాపతి వంటి గడుసు పండితులూ
చింతాదీక్షితులు వంటి చేయితిరిగిన రచయితలూ
ఈ రంగంలో కృషి చేశారు.
బాలానంద సంఘం, అన్నయ్య అక్కయ్యలూ

ఈ శాఖకు మూడుపూలు పూయించారు
ముప్ఫయ్యారు కాయలు కాయించారు.

ఒక పదిహేనేళ్లుగా కేంద్రప్రభుత్వ దోహదంతో
ఈ శాఖ
మరింతగా కొనలు సాగింది.

ఇంతకు బాలసాహిత్యమంటే ఏది?
బాలల మనస్తత్వాన్ని గమనించి,
వాని రకరకాల అంచుల్ని స్పృశించి,
వాళ్ళ మనోవికాసానికి దూరాకు హత్తే విషయాలను స్వీకరించి
సరళంగా సుందరంగా చెప్పే సాహిత్యం.
అంతేకాని చేవలేని కవితలూ
జావగారే కథలూ
బాల సాహిత్యం అనిపించుకోవు.

బాలసాహిత్య సృష్టి
బయటికి అగుపించేంత
చాలామంది అనుకునేంత
సులభమైన పనికాదు.
అందరు రచయితలవల్ల
అయ్యేదీ కాదు.

కొండంత విషయాన్ని
గోరంత మాటల్లో చెప్పాలి.
విజ్ఞానానికీ వినోదానికీ
అందమైన ఆనకట్ట వేయాలి.

కవి తాను ఎంత కొమ్ములు తిరిగినవాడైనా
పిల్లల ఆలోచనలకూ
అనుభూతులకూ
అనుగుణంగా ఇమిడిపోవాలి.
అంటే___
రాజమార్గంలో నడయాడే పట్టపుటేనుగు
ముచ్చటగా ముక్కాలిపీటమీద తిరగ గలగాలి.

మిత్రుడు మిరియాల రామకృష్ణ
ఈ కోవకు చెందిన కవే.
'భారతి'లో ఇతని పద్యాల పాకసిద్ధినీ
సమాసజటిలతనూ చూసి
హడిలిపోతూ వుండేవాణ్ని.
అలా ప్రౌఢ కవితాధ్వంలో పదం మోపిన రామకృష్ణ
క్రమంగా బాలల కవిగా
బహుమతులందుకున్నాడు.
పద్యంలో సేద్యం ప్రారంభించి
పాటల పంటలు పండించుకున్నాడు.
ఇటీవల
వచన కవితారీతిలో
కాకలు తీరిన కవిగా
జోతలందుకుంటున్నాడు.

ఏది రా స్తేమి?
రామకృష్ణ నిఖారసైన కవి.
"రంగురంగుల రత్నదీపాలు" పిల్లలకోసం వెలువడిన పాటలు.
సరళభాషలో బాలలకోసం రాసినంత మాత్రాన
రామకృష్ణ ప్రౌఢ కవితాత్మ ఎక్కడికి పోతుంది?
ప్రతిగేయంలోనూ
ఎక్కడో ఒకచోట పొడుచుకొస్తుంది.

వెన్నెలల మీద పాట రాస్తున్నాడు.
ఎత్తుగడే ఇలా వుంది
"ఆకాశం ఆవుపాలు
అన్నీ ఇవి వెన్నెలలా!"
ఎంత ఎత్తుల కెగిరాడు.
కాస్త ఆగి ఇలా సాగింది
"జాబిలి ఒడిలో నుండియె
జారిన బియ్యం కావా"
తానుంటున్న సమాజాన్ని తప్పించుకోలేని వాస్తవిక చిత్రణ ఇది.
అయితే రుచీపచీలేని పేలవ చిత్రణ కాదు.

కల్పనాగంధం అలదుకున్న కమనీయ చిత్రణ.
ఇలా ఉత్ప్రేక్షింపబడిన వెన్నెలలు చివరికి
'తూరుపు పాపల పెదవుల
జారిన నవ్వు లివేమో'
అన్నట్టుగా భాసిస్తాయి.
ఇక్కడ కవి సౌందర్యదృష్టితోపాటు
సంయమన శిల్పంకూడా పరాకాష్ఠ నందుకున్నాయి.
బాలసాహిత్య రచయితకు
సమస్త వర్ణనీయాంశాలూ
పిల్లల మనస్తత్వానికి అనుగుణంగానే కనిపించాలి.

ఎక్కడికెగిరినా చివరికి అక్కడే దిగాలి.
వెన్నెలలు తూర్పుపాపల చిరునవ్వులుగా అగుపించడంలో
ఈ మనస్తత్వమూ ఎనలేని ఔచిత్యమూ పురిగొన్నాయి.

ఇలా రాసుకుంటూ పోతే
రామకృష్ణ గిపిన వర్ణగీతాలన్నిటినీ ఉదాహరించవలసి ఉంటుంది.
ఇరవై ఏడు గీతాల్లో
అర్భకంగా వున్నదేదని
మళ్ళీమళ్ళీ తిరిగేసి చూశాను.
అర్భకుల కోసం రాసినవే అయినా
అన్నీ రసనిర్భరంగానే వున్నాయి.
అన్నిటిలోనూ ఊహ ఉక్తి
ఉదాత్తంగా మాధ్వీసిక్తంగానే వున్నాయి.

పిల్లల పాటల్లోకూడా
కొల్లలుగా భావకవితా
మల్లికలందించిన
మా రామకృష్ణ అభినంద్యుడు.

ఈ రంగురంగుల రత్నదీపాల వెన్నెలలో
బాలల వదనాలు మెరుస్తాయి.
హృదయాలు విరబూస్తాయి.

25-6-1971 హైదరాబాదు.

* * *




ఊహల్లో నే నెపుడూ
  ఉయ్యాలలు ఊగుతాను!
ఆలోచనతోనే నే
  పాలుపెరుగు త్రాగుతాను!

ఆలోచిస్తూంటే నా
  కానందం హెచ్చుతుంది!
ఆలోచన నా తలలో
  పూలదండ గ్రుచ్చుతుంది!

వాన కురుస్తున్నపుడూ
  మెఱుపు మెఱుస్తున్నపుడూ
మేను పులకరిస్తుంది!
  మెదడు మేలుకుంటుంది!

* * *



# ఎవరమ్మా

ఆకాశంపై మబ్బుల కంబళి
  అమ్మా! వేశారెవరే?
ఉరుమురథముపై హోరునపోయే
  పౌరులెవ్వరే అమ్మా!

మెరుపు పాములను మెల్లమెల్లగా
  లాలించేవారెవరమ్మా!
తూనీగల గాలిపటాలను
  ఎగరవేసినారెవరమ్మా!

పచ్చగడ్డిపయి ఆణిముత్యములు
  పారబోసినా రెవరమ్మా!
మబ్బులపై ఆ యేడురంగులను
  జల్లివేసినా రెవరమ్మా!




గుండె లోపల నిండు వెన్నెల
కూర్చుకొనగల మబ్బులం!
మెదడు లోపల మెఱుపుతీగల
మడుచుకొనగల మబ్బులం!
ఏడురంగుల ఇంద్రధనువును
ఎక్కుపెట్టెడి మబ్బులం!
ఎండిపోయెడి ఏటిగొంతును
నిండజేసెడి మబ్బులం!
మొలకలెత్తెడి ముద్దుపైరుల
పలకరించెడి మబ్బులం!

* * *




ఎండలారిపోవుదాక
 ఎక్కడ దాక్కుంటావే?
నీవే ఒక బూచి వంట
 నిజమేనా చీకటీ?

నీ జడలో చందమామ
 రోజూ కనబడదేమే?
ఎక్కడ దాచావే మా
 కొక్కమాటు ఇస్తావా?

ఈ నీలపు చీర నీకు
 ఎవరు పెట్టి పంపారే?
ఈ చుక్కల పరికిణీని
 ఎవరు నీకు కుట్టారే?

ముస్తాబై వస్తేనే
 ముద్దుగ నిను చూస్తానే!
వెలుగులేక వస్తే నిను
 వెక్కిరించి పోతానే!

* * *




చీకటిలో దీపం లా
చెక్కిలిపై కోపం లా
అందంగా మెఱసిందీ!
అంతలోనె ఆరిందీ!

'ఇంచక్కా ఎగిరిన ఓ
మంచి మిణుంగురుపురుగా!
ఎవరు తప్పిపోయారే?
ఎంతసేపు వెదికావే?'

చుక్క ఎగిరివస్తున్నది
చూశావా చెల్లీ!
తళుకు లారిపోకుండా
దాద్దామా తల్లీ!

* * *




ఆకాశం ఆవుపాలు
        అన్నీ యివి వెన్నెలలా?
చీకటి కుంకుడు నురగలు
        చిక్కనివివి వెన్నెలలా?

నల్లని మబ్బుల తలలో
        నవ్విన పువ్వులు కావా!
జాబిలి ఒడిలో నుండియె
        జారిన బియ్యం కావా!

చుక్కలు కొట్టిన బియ్యపు
        చక్కని పిండి యిదేమో!
తూరుపు పాపల పెదవుల
        జారిన నవ్వు లివేమో!

* * *



# తోట

ఎన్నో రంగుల చిఱునవ్వులతో
నన్నే రమ్మంటున్నది తోట!
తీయదనము పొంగే తేనెలతో
తేటిని రమ్మంటున్నది తోట!

అత్తరువాసన పన్నీరులనే
అంతట జల్లిస్తున్నది తోట!
పచ్చని ఆకుల కదలికతోనే
పాటలు వినిపిస్తున్నది తోట!

చిన్నరి మొగ్గల నిద్దుర లేపే
చిఱుగాలిని రమ్మన్నది తోట!
బంగరు పువ్వుల బరువును మోసే
బాలికలను రమ్మన్నది తోట!

* * *



# ఎగిరె పిట్టలు!

ముడిచి పెట్టిన ఱెక్కసందుల
ముందుగాలుల నింపుతూ
ఎగిరె పిట్టలు! ఎగిరె పిట్టలు!!

ముక్కులూపుతు కాళ్ళు చాపుతు
ఎక్కడైనా తిండి వెదకుతు
ఎగిరె పిట్టలు! ఎగిరె పిట్టలు!!

ఆకసంలో గాలికెదురుగా
అడవిలోనూ ఏటిమీదా
ఎగిరె పిట్టలు! ఎగిరె పిట్టలు!!

మబ్బు దొంతర కిందనుంచీ
మట్టిపైకే తొంగిచూస్తూ
ఎగిరె పిట్టలు! ఎగిరె పిట్టలు!!

* * *



# తొండ పాట

తీగ మీద గోడమీద
తిరుగుతోంది తొండ!
పురుగురెక్క గాలిక్రింద
పొంచుతోంది తొండ!

మ్రాని మీద మేనిరంగు
మార్చుకుంది తొండ!
గడ్డిపూల రేకు ప్రక్క
కదులుతోంది తొండ!

మెడను చాచి పైకి చూచి
మెదలకుంది తొండ!
నాల్క చాచి పురుగు దోచి
నములుతోంది తొండ!

* * *



# గారడివాడి పాము

వీధి గారడివాడి చుట్టూ
వెఱ్ఱిగా తిరిగేటి పామా!
పుట్టలో కాపురము నెటు పో
గొట్టు కున్నావే?

పడగ విప్పుతు బుసలు కొడుతూ
పాకి మెలికలు త్రిప్పుకుంటూ
రెండు నాల్కలు చాపుకుంటూ
నిండు విషమును గ్రక్కుదానా!
ఎట్టు గారడివాడి చేతికి
కట్టుబడి పోయావె పాపం!
బుట్టలోనే మెలిక తిరుగుతు
బోర్లాపడ్డావేమె పాపం!

పొట్టతోనే ప్రాణిపోతూ
పొంచి కప్పను మింగుకుంటూ
మనిషి కాలిని కాటువేస్తూ
మసలుతుంటె నాగుబామా!
ఏటిగట్టుల పొదలు విడిచీ
మొగలిపూవుల డొంక విడిచీ
మొండి గారడివాడి మెడలో
మూల్గుతున్నా వేలనే?

* * *



# జాలరి పాట

నిన్నరాతిరీ పన్నిపోయిన
నీళ్ళలోపలి వలను చిక్కి
వెండిబొమ్మల్లాగ మెరిసే
పెద్దచేపలు చూసివద్దాం!

సాగరం మన చేతికిచ్చే
సంపదలురా చేపలన్నీ!
రండి! వలలోనుండి బయటకి
లాగివేద్దాం చేపలన్నిటి!

ఈ సముద్రం నీళ్ళ నీలిమ
మీద మిలమిలలాడు చెపల
బుట్టలోనికి పట్టి పట్నం
పోయి అమ్ముదమండి! రండి!

* * *




రాజు కూతురి పెళ్ళికోసం
        రంగుచీరలు నేసినారా?
పుట్టబోయే పాపకోసం
        పూల మొగ్గల నద్దినారా?

కన్నెపయటకు జరీ అంచుల
        కండువాలను అల్లినారా?
మంత్రి దుస్తుల కొఱకు ఖద్దరు
        మగ్గమెక్కించార లేధా?

గస్తీలో పోలీసు కోసం
        ఖాకి బట్టలు నేసినారా?
పచ్చజెండా కుట్టుకొనుటకు
        పట్టుతానులు చుట్టినారా?

* * *



# పాపం! బిచ్చగత్తె!

ఈమె పాడే జాలిపాటకు
ఏడ్చుచున్నది వీథి అంతా!
ఈమె చూపులలోని లోతుల
ఈదుచున్నది ఎఱడ అంతా!

ఈమె కట్టిన చింకిగుడ్డల
కెదురు వెళ్ళెను ధూళి అంతా!
ఈమె పట్టిన సంచిలోపల
ఏమి చేరెను గాలి తప్పితె!

ఈమె నిల్చిన యింటి వాకిలి
ఎఱిగియెఱుగక మూగబోయెను!
ఈమె ఎవ్వరు? ఈమె ఎవ్వరు?
ఎవతు పాపము! బిచ్చగత్తియ!

* * *




తెలుపు—

వెన్నెలలలో నేను
విరగబడి నవ్వాను!
కీర్తిలోపల నేను
కిలకిలా నవ్వాను!

నలుపు—

చీకట్లలో నేను
చెంగుమని ఉరికాను!
అపకీర్తిలో నేను
అల్లుకుంటున్నాను!

ఎరుపు—

పూలరేకుల నేను
పొంగిపోతున్నాను!
ప్రేమ లోపల నేను
రేకులను విప్పాను!

పసుపు—

పుప్పళ్ళలో నేను
పొర్లిపోతున్నాను!
జీవకళలో నేను
చేయెత్తుతున్నాను!

నీలము—

ఆకాశమున నేను
అందాలు పొందాను!
గుండెలందున నేను
గూడు కడుతున్నాను!!



# ఎఱ్ఱని పూల చెట్లు

ఆ వసంతం లోన మేమొక
అడవిలోనికి పోయినాం!
ఎచట చూస్తే అచ్చటే కని
పించే ఎఱ్ఱని పూలచెట్టులు!

వాటి మీదే చూపులన్నీ
వ్రాలుతూంటే అడిగివేశా
ప్రక్కనడిచే పెద్ద తరగతి
బాలునొక్కనివైపు చూస్తూ

"కుంకుమను తమ మీద జల్లుకు
కొమ్మ కొమ్మకు గోరువంకల
పిల్చి కూర్చొబెట్టుకున్నవి
వీని పేరేమి?"

నేను వేసిన ప్రశ్న వింటూ
తాను పెదవులు విప్పకుండా
చెట్టునీడను ఉన్న శిలపయి
చెక్కె పేరును మిత్రుడు!

"వాటిపేరే మోదుగుల్"



# మరపురాదు

మబ్బులుండే రెండు కొండల
        మధ్య ప్రవహిస్తోంది గంగ!
లోతు తెలియని గంగ మీదే
        ఈత కొట్టుచునుండె నావ!

నావపై చిఱుగాలి లోపల
        నా తలంతయు రేగుతున్నది!
రేగిపోయే నల్లమబ్బుల
        ఏగుచుండెను తెల్లకొంగలు!

మరపురాదా నావ పయనము!
        మనసులోనే కదలుచుండును!
నిజమొ! కలయో! చిత్రకారుని
        నీటిరంగుల బొమ్మయో!

* * *



# నాల్గు దిక్కులు

నాల్గు దిక్కుల చిట్ట చివరకు
నడిచి చూస్తే ఏమిటుండును!
చూచిరావాలన్న కోరిక
లేచె నా మది నెక్క రోజున!

అటులె ఆలోచించుకుంటూ
అంతలోనే నిద్రపోవగ
ఎవ్వరో రెక్కలను కట్టి
ఎగిరిరమ్మని పిల్చిరీ!

అపుడు తూర్పుగ పోయి చూస్తూ
అడిగినానిటు గట్టిగా—
"ఇక్కడెవరున్నారు తూర్పా!
ఇక్కడెవరున్నారు చెప్పూ!"

తూర్పు—"ఇంద్రుడి పరిపాలన లోపల
ఇటువైపే స్వర్గం వున్నది!
ప్రతిదినమూ సూర్యుడి వెల్గులు
పంపించే దిక్కును నేనే"

అపుడు పడమర కరిగిచూస్తూ
అడిగినానిటు గట్టిగా
"ఇక్కడెవరున్నారు పడమర!
ఇక్కడెవరున్నారు చెప్పూ!"

పడమర—"ఇటుపైపే వరుణుడి నగరం
ఎవడాతడు? వానకు దేవుడు!
ప్రతి దినమూ సూర్యుడి వెల్గులు
పంచుకునే దిక్కును నేనే"

అపుడు దక్షిణదిక్కు చూస్తూ
అరచినానిటు గట్టిగా
ఇక్కడెవ్వరు! దక్షిణంబా
ఇక్కడెవరున్నారు చెప్పూ!

దక్షిణం—"ఇటుపైపే నరకం ఉన్నది
ఇటుపైపే యముడి ప్రపంచం
పాపాలను చేసిన మనుషుల
తాపాలకు నేనే సాక్షిని!"

అపుడు ఉత్తరదిక్కు చూస్తూ
అరిచినానిటు గట్టిగా
"ఇక్కడెవ్వరు ఉత్తరంబా!
ఇక్కడెవరున్నారు చెప్పూ!"

ఉత్తరం—"ఇటుపైపే అలకానగరం
ఈ నగరం రాజు కుబేరుడు!
ధనమంతా ఈతని యింటనె
దాక్కున్నది కళ్ళుమూసుకుని"

గడియారం అంతటిలోనే
గంటలు కొట్టెను గణగణ గణగణ
కలకాస్తా అయిపోయిందని
నేను తెలిసికొని కళ్ళు తెరిచితిని

* * *



# "అడవి! కారడవి!"

'అడవి! కారడవి!' అని భయపడి
అడవికి పోవుట మానకు!

ఎన్నో పువ్వుల తేనెలు జారిన
ఈ వాగునీళ్లు త్రాగూ!
పువ్వుల వానలు తలపై జలజల
పోసే నీడల తిరుగూ!

ఎండల జాడలు ఎరగని బండల
ఎక్కడనైనా కూర్చో!
పిట్టల పాటలు విని పులకించే
పిల్లగాలితో ఆడూ!

పొగరుగ తోకాడించే పులిగని
పొదరిళ్ళల్లో పొంచూ!
పురివిప్పిన మగ నెమలిని చూస్తూ
పొంగి పాటలే పాడూ!

పండి పసందుగ పడిపోనుండిన
పళ్ళ రసాలను పీల్చూ!
కుంకుమ పసుపుల ఆకుపచ్చనల
రంగుల పూవుల గ్రుచ్చూ!

'అడవీ- కారడవీ'- అని భయపడి
అడవికి పోవుట మానకు!

* * *



# ఉగాది

సుప్రభాతమ్మాయె! సూర్యుండు వెలిగె!
కొమ్మపై కోయంచు కోకిలలు కూసె!
చిలుకల పలుకులు చెవుల విందాయె!
నేడుగాది యటంచు పాడిరి కవులు!

చైత్రమాసము వచ్చె చనియె శిశిరమ్ము!
క్రొత్త చివురులు పట్టె కొమ్మకొమ్మకును!
పిల్లతెమ్మెర సాగె బిరబిర వచ్చి
నేడుగాది యటంచు పాడిరి ప్రజలు!

తీపి పులుపురుచులు వేపపూ చేదు
వింత పచ్చడిచేసి విందుగా తినుచు
చక్కగా పంచాంగ శ్రవణమ్ము చేసి
నేడుగాది యటంచు పాడిరెల్లరును!

మామిడి పూవుపై మసలె భృంగములు!
అఱగిమఱగిన పికములఱచె గొంతెత్తి
వెడలిపోయెను ప్రాతబడిన వత్సరము!
మఱియొక్క వత్సరము తఱలి వచ్చింది!

* *



# ఓహో! సముద్రమా!

ఓహో! సముద్రమా! ఒకమాట చెప్పు!
అసలు నీకున్నదా అవతలి ఒడ్డు!
అసలు నీ లోతునకు అంతొకటి ఉందా?
ఓహో! సముద్రమా! ఒక మాటు నిలువు!

ఏ అయస్కాంతాన్ని ఎక్కడ దాచి
ఎక్కడెక్కడి నీటి నెటు లాగినావు?
వేనవేలామడల్ విసుగులేకుండ
పరుగెత్తి వస్తాయి వరదలై నదులు!
ఎప్పుడే పిలిచావు? ఎందుకే కడలి?
నీ యింటనే గొప్పనీళ్ళుండ లేదె?

సూర్యుడు వచ్చాడు! సూది కిరణాల
అదిగదిగొ! నీ నీరు ఆవిరవుతోంది!
ఆవిరంతా కలిసి అయిపోయె మబ్బు!
ఎన్ని మబ్బులు వచ్చి నిన్ను త్రాగినను

ఎండిపోవడ మనేదే లేదు నీకు!
ఏమిటీ చిత్రము! ఏమిటే కడలి!

రత్నాలు వజ్రాలు రంగురంగులవి
నీ ఖజానా నిండ నిండి ఉన్నాయి!
భూమి కడుపును గొట్టిపోయినవాడు
నిను కొల్లకొట్టగా నెత్తురా కడలి!
ఏమిటీ చిత్రము! ఏమిటే తల్లి!

నిజమటే విన్నాను నీ కథలు నిన్న!
నీ కడుపులో పెద్ద ఆకలి గలట్టి
అగ్ని రాక్షసుడెవడొ అణిగి ఉన్నాడ!
అయ్యో బాబో! ఎలాగతని మోస్తావు?

కల్పవృక్షం నీదు కడుపున పుట్టె!
కామధేనువు నీవే కన్నావు మున్ను!
హాలాహలమెగాక అమృతాన్ని కూడ
గుండెలొ నుండియే పిండినావటగ!

లక్ష్మి మహాదేవి లావణ్యమంత
జాబిల్లి చిఱునవ్వు జల్లు వెన్నెలలు
పొటమరించాయి నీ పొట్టలో నుంచి
నిన్ను చూస్తే పోవు నిఖిల పాపాలు!
ఓ హెూ సముద్రమా! ఒకమాట చెప్పు!
అసలు నీకున్నదా! అవతలి ఒడ్డు!

* * *



# ఆనందమంటే!

కోటి చుక్కల కాంతులారా!
నీటిమబ్బుల మెరుపులారా!
తేట వెన్నెల వెలుగులారా!
తెలుసునా ఆనందమంటే!

వీణ మెట్టుల వ్రేళులారా!
వాన కోయిల కూతలారా!
తేనెటీగల పాటలారా!
తెలుసునా ఆనందమంటే!

నాగుబాముల పడగలారా!
సాగుభూముల పైరులారా!
తీగ నూపెడి గాలులారా!
తెలుసునా ఆనందమంటే!

* *



# నీడలు

ప్రొద్దు పొడిచిన వేళలోనే
నిద్దరలు లేచాయి నీడలు!
లేచినప్పటినుండి మనకై
వేచి ఉంటున్నాయి నీడలు!

ఎండలో తిరిగామొ లేదో
ఎంత దూరం అయిన వస్తై!
చెట్టు కిందో మబ్బు కిందో
చేరినా మన జట్టు విడవవు!

వెన్నెలంటే మనకు లాగే
వేడ్కలున్నై నీడలకుసూ!
నీడలే లేకుంటే వెన్నెల
వాడలో అందాలె ఉండవు!

* *



# ఏం చేయాలి?

మాటలు బయటికి రావాలంటే
వాటికి పెదవులు తెఱవాలి!
చూపులు బయటికి రావాలంటే
చురుకుగ రెప్పలు విప్పాలి!
వెలుగు లోనికి రావాలంటే
తలుపులు ఇంటికి తెఱవాలి!
తలపులు బయటికి రావాలంటే
తలుపులు గుండెకు తెఱవాలి!
మొగ్గలు పూలుగ మారాలంటే
ముందుగ రేకులు విరియాలి!

* * *



# సూర్యబింబం

ఆరుగంటల వేళ పడమర
　　కరిగి నిలిచెను సూర్యబింబం!
ఎండలో పయనమ్ము చేయుచు
　　ఎఱ్ఱబడినది సూర్యబింబం!

కందిపోయిన మోము కడుగగ
　　కడలిలో దిగె సూర్యబింబం!
కడలి లోతుల లోన జారుచు
　　కలిసిపోయెను సూర్యబింబం!

మకిలి చీకటి వచ్చెననియా
　　మాయమైనది సూర్యబింబం!
తాను వచ్చేదాక దివ్వెకు
　　తళుకు లిచ్చెను సూర్యబింబం!

* * *



# నిన్నా నేడూ రేపూ

నిన్న వేఱూ! నేడు వేఱూ!
రేపు వేఱూ!
రోజురోజూ క్రొత్తయే యీ
లోకమంతా!

నిన్న కాసిన ఎండ కన్నా
నేడు హెచ్చూ!
నేడు చూచిన చంద్రబింబం
రేపు చిన్నది!
నిన్న నడచిన బాటలోనే
నేడు చూస్తే
ఎంత మందో కొత్త మనుషులు
సాగిపోదురు!
నేటి పిల్లలు రేపు పెద్దలు
నిజంగానే!

* * *



# రైలులోంచి

వేపకొమ్మల దూసుకుంటూ
　　ఈత మట్టల నెక్కి దిగుతూ
రైలు కిటికీ దూరి వెనుకకు
　　గాలి జారింది!

మదపుటేనుగుల లాంటి కొండలు
　　ఎలుగుబంటులలాంటి గుట్టలు
రైలు కూతను వినీ వినకే
　　నిలిచి ఉన్నాయి!

భూమి దాచిన పంట వెదుకుతు
　　నడిచిపోయే రైతునాగలి
నల్లరాళ్లకు జంకిపోతూ
　　నిలిచిపోయింది!

పరుగులెత్తే గిత్తదూడను
　　చూసి చూడక రైలు ఇంజను
గుప్పుగుప్పున పొగలు చిమ్ముతు
　　పారిపోతోంది!

* * *



# చివరకు మిగిలింది!

త్రీయమామిడి చెట్లతోటకు
తీరుబడి అయినప్పుడల్లా
పోయి తిరగడమందు నాకెదో
హాయిగా ఉంది!

చెట్ల కొమ్మలకేసి చూస్తూ
చేతితోనే అందుకుంటూ
నీడలందే తిరిగి యింటికి
నేను పోతాను!

కొన్ని నాళ్ళకు మావి చెట్టుల
కొమ్మలన్ని చిగురు పట్టెను!
చిగురులన్ని ఆకులవుతూ
చెరిపివేసెను ఎఱ్ఱరంగును!

కొన్ని నాళ్ళకు మావి చెట్టుల
కొమ్మలన్నీ పూలు పూచెను!
మావి పువ్వులు పిందెలవుతూ
మారిపోతూ కానుపించెను!

కొన్ని నాళ్ళకు పిందెలన్నీ
గుంజు నిండిన కాయలయ్యెను!
మావికాయలు దోరముగ్గుతు
మనిషి చేతికి అందిపోయెను!

చిగురుటాకుల ఎఱ్ఱరంగులు
చెరిగిపోనె లేదు నాలో!
మావిపిందెల పచ్చదనములు
మాయమే కాలేదు నాలో!

* * *

రచయిత:

## ఎరియశాల రామకృష్ణ

ఒక పక్క
ప్రౌఢసాహిత్యంలో
ప్రయోగ పటిమతో
నింగికెగురుతూ
మరోపక్క
బాలసాహిత్యంలో
మృదుపదవిన్యాసంతో
నేలకు దిగుతూ
'శిఖరస్థైన కవి'
అనిపించుకొంటున్న
రచయిత.

ఇతర రచనలు—

(1) 'బాలాభిరామం''
నాలుగు దక్షిణాది భాషల్లో
తెలుగుకు ప్రతినిధిగా ఎన్నికై
'దక్షిణభాషాసంస్థ'
[illegible]
గేయదామం.

(2) 'స్నేహదీవళి'
ఊహలవాహినులపై
స్నేహమాధురిని
నలుదెసలా పంచిపెట్టే
పలుగేయాల నవ్యకేళి

(3) 'విద్యుద్దీపాలు-వెన్నెల తీగలు
వీణల్లో లేని విద్యుత్తునూ
వెన్నెలకు లేని తీగలనూ
భావనా జగత్తులో సృష్టించి
జాతికి చైతన్యాన్ని
వ్యక్తికి ఆనందాన్ని
అందించే
అభినవ వచన కవితా
ఖండాలమండలి.

• • •